## డా. జె. సి. ఘోష్, ఎం. ఎ

యఫ్, సి, యస్, (లండన్) యం, సి, యస్, (అమె)
అయుర్వేదశాస్త్రి, భాగల్పూర్ కాలేజీలో
పూర్వము రసాయనిక శాస్త్రాచార్యులు

### ప్రకటన

15-1-1944 నుండి శ్రీనివాస మెడికల్ అండు ఫార్మసిమార్ట్సు రేపల్లె (గుంటూరుజిల్లా) వారిని మద్రాసు రాజధానికంతకు దేశీయసంస్థానములతో సహా మాసోల్ ఏజంట్లుగా ఏర్పాటుచేసినామని సంతోషముతో తెలుపుచున్నాము.

కనుక, మా ప్రోత్సాహకులు, ఏజంట్లు, గ్రాహకులు, మాసోల్ ఏజంట్లకు యిదివరకుకంటె నధికముగా సహకారము చేయుదురుగాక యని కోరుచున్నాము

మా ప్రోత్సాహకుల కందరికి మనవిచేయునది యింకాయేమనగా, ప్రస్తుత పరిస్థితుల ననుసరించి యీక్రింది ఔషధములు వెలలు యీక్రిందివిధముగా హెచ్చించినాము

| | | | | | |
|---|---|---|---|---|---|
| మృతసంజీవని | 11 ఔన్సులు | 3-0-0 | శారిబాదిసరస | 8 ఔన్సులు | 1- 8-0 |
| మృతసంజీవని | 22 ,, | 5 8-0 | | 16 ,, | -13-0 |
| చ్యవనప్రాశ | 1 శేరు రు 6 అర్థశేరు రు 3 | | | 24 ,, | 4- 2-0 |
| | పావుశేరు 1-8-0 | | | | |

ఇతర ఆసవములు, అరిష్టములు 8 ఔన్సులబుడ్డి 1-2-0. 16 ఔన్సులు 2-0-0 24 ఔన్సులవి రు 2-14-0. వీటిలో కర్పూరారిష్ట, దశమూలారిష్ట కస్తూరి, మహాద్రాక్షారిష్ట 6 సం॥ పాతవిచేరవు

# సాధనౌషధాలయము

## ఢక్కా (బెంగాల్)

ప్రఖ్యాతివహించిన ఆయుర్వేదౌషధాలయము

---

భీతికొల్పు జబ్బును నిర్మూలముచేయుటకు

## మలేరియా జాండు

ట్రేడుమార్కు

మలేరియామిక్చ్చర్

ఉపయోగించుడు

దీనిని వాడుటచే

శీఘ్రకాలములో ఈవ్యాధి

సమూలముగా నివారణయగును

జాండుఫార్మసీ వర్క్సు

లిమిటెడు - బొంబాయి

నైజాంరాష్ట్రపు ఏజంట్లు

డి. జె. పారిఖ్ అండుకో —శికింద్రాబాదు(దక్కన్)

---

## క్రిష్ణానిషాత్ హేర్ ఆయిల్

రిజిష్టరు నెం. [illegible]

ఈ తైలము నుపయోగించిన మెదడునకు పుష్టి, కండ్లకు చలువ కలిగించి, నిద్రలేమి, వెంట్రుకలురాలుట, ఇంద్రలుప్త [అనగా బట్టతల, దుండు మొదలగు దుర్లక్షణములను పోగొట్టి వెంట్రుకలు మృదువుగను గుజ్జగను, ఆకర్షణీయముగా పెరుగుటకుపకరించును.] ఈతైలము ప్రత్యేకముగా బట్టతలఉన్నవారు కూడా వాడినపక్షమున ఒకనెలలోపల వెంట్రుకలు ఆకర్షణీయముగావచ్చును. ఈ తైల లేపనమున వయసమించినవారుకూడ నవయవ్వనులవలె కనబడుదురు. వెల సీసా 1కి రు. 1-8-0

క్రిష్ణా అండ్ బ్రదర్సు ఈసామీయాబజారు, హైదరాబాదు-దక్కన్.

---

# ఉర్దూ తెలుగు స్వబోధిని

నిజాం రాష్ట్రములోని ప్రతి ఆంధ్రుడు ఉర్దూ రానిచో చాల కష్టపడవలసి యున్నది. రాష్ట్రపు ప్రతి కార్యమును ఉర్దూలోనే జరుగుచుండును- ఉర్దూ ప్రతి ఆంధ్రుడు నేర్చుట అత్యవసరము.

ఇట్టిబాధ నివారణకై "ఉర్దూ తెనుగు స్వబోధిని" యను కొనియాడతగిన చక్కని పుస్తకము నూతనముగా ప్రచురింపబడెను.

పేజీలు 150 వెల 1-8-0

వలయువారు:—

శ్రీరామా బుక్ డిపో

మార్కెటువీధి, శికింద్రాబాదు

---

# పేజీలు 1168 వస్తుగుణప్రకాశిక

ఆయుర్వేదభూషణ, భిషగ్వర పిడూరిపాను దేవశాస్త్రి విరచితము, సంస్కృత,ఆంధ్ర,ఆంగ్లనామములతో మూలికలచేర్చుట, తెలుగువచనమున నాటి ఉత్పత్తిస్వరూపములు, రసవీర్యవిపాకములు, గుణకరులు, గొప్పదోషధరోగములు నవీన వైద్యుల మతమునుసరించి గుణములు వివరింపబడినవి. రు. 5-0-0 మనీఆర్డరుపంపి దగ్గర రైలుస్టేషనుపేరు తెలుపునెడల చార్జీలు మేమే భరించి తక్షణము పంపుదుము. శ్రీ పవర్ ప్రెస్, రాజమండ్రి అని వ్రాసేది

---

## అది రుచికరంగాను తృప్తికరంగాను వుండాలి...
## అయితే బలాన్ని చేకూర్చగలశక్తికూడా దానికి వుండాలిసుమా!

డాల్డా దీనిని నెరవేరుస్తుంది — మా కుటుంబమును చూడండి.

ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థముల శక్తి నిచ్చునవో తెలుసుకొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయబడినది) [illegible] ఇండియన్ [illegible] [illegible] తయారుచేయు పద్ధతులతో కూడినది. [illegible] ఉచితముగా పంపబడును. [illegible] Dept. A119 P. O. Box No. 353, Bombay. [illegible]

మీ కుటుంబముయొక్క ఆహారము వండేటప్పుడు యీ విషయం ఎప్పుడైన ఆలోచించారా? ఆహారం రుచికరంగా వున్నంత మాత్రాన చాలదు — మంచి పుష్టినిచ్చునట్టిదిగా వుండాలి. కొన్ని ఆహారపదార్థములు అన్నిటికంటె శక్తిదాయకములై వుంటవి. అవి [illegible] కొన్ని బలము నిచ్చునవిగా వుండవు. [illegible] మంచివి కాకపోగా, ఆరోగ్యమును మన ఆరోగ్యమునకు మంచివి కావు — [illegible] చెడగొట్టును — ముఖ్యముగా పిల్లలకు మరీని. కాని ఆహారమును బలంచేకూర్చేదిగా చేయుట [illegible] కష్టమైన పనికాదు. ఆహారమును విటమిన్లతో నిండిన డాల్డాతో వండిన మొదల యీ విషయములో మనకుబాగా తోచును. ఈ డాల్డాలో ప్రకృతి సిద్ధముగా బలమును, పుష్టిని యిచ్చు "ఆహార పదార్థములు" యిమిడి వున్నవి. డాల్డాతో తయారు చేసినంత రుచిగా [illegible] ఏ యితర పదార్థములతోను వంట చేయుటలో సందేహమేమియు లేదు. [illegible] చూడండి. [illegible]

The DALDA COOK BOOK Price Re.1/-

విటమిన్లతో నిండిన డాల్డా బలమునకు

---

వాడండి

## "సింప్లెక్సు" వస్తువులు

"చార్ మినార్" బ్రాండు

GENUINE DOUBLE BOILED SIMPLEX OIL MILLS BOMBAY LINSEED OIL

అన్నిచోట్ల అమ్మబడును—

చౌకైన డి.బి. లిన్సీడ్ ఆయిల్,పట్టినర్ పాలిష్ పెయింట్లు, వార్నిష్, ఫిష్టైల్ టర్పెన్టైన్ మొదలగునవి.

సోల్ ఏజంట్లు—

## నేషనల్ ట్రేడింగ్ ఏజన్సీస్

61 జేమ్సుస్ట్రీటు, సికింద్రాబాదు

ఫోను నెం. 1527

S N. Publicity]

---

ఇనాము! ఇనాము!

సులభ నియమములు, ఆరోగ్యానికి సౌఖ్య జీవితానికి, ఉత్తమ సంతానప్రాప్తికి మరియు సంసారసుఖమునకు మార్గము.

## "దాంపత్య వికాసము"

పోష్టు ఖర్చులు లేకుండానే ఉచితంగా అభ్యంకాగలదు.ఆశాభంగంచెందకుండా త్వరపడండి! మదనమంజరి ఫార్మసీ,

194, చైనాబజారురోడ్డు మదరాసు

---

## రఘునాథ్ మల్

బ్యాంకర్

ఆబిద్ రోడు హైద్రాబాదు- దక్కన్.

అన్నిరకముల బ్యాంకు వ్యవహారములు సరసమగు పద్ధతులలో జరుపబడును.

బ్రాంచీలు:—

జేమ్సుస్ట్రీటు శికింద్రాబాదు.

పత్తర్ ఘట్టి హైద్రాబాదు. దక్కన్

---

## ప్రదర-సుధారిణి (స్త్రీలకు వరప్రసాదిని)

ఈమందు యెటువంటి తెలుపు, ఎరుపు, పచ్చని ప్రదరసంబంధములకును రామబాణము నూతనమేకాక పురాతనవ్యాధినికూడ గ్యారంటీగ కుదుర్చును- పైమందును ఒకసారివాడిన మీకేగుణము తెలియగలదు. వెల రూ. 2-8-0

## పుష్టి సుధాచూర్ణము

మూత్రములో లేక స్వప్నములో వీర్యము పోవుచున్నచో నీచూర్ణము దానిని గట్టిపరచి శక్తిగలుగజేయును. ఎటువంటి పలచని ధాతువునుకూడ కుదిర్చి గట్టిగాజేయును. సంభోగ సామర్థ్యము లేనివారికి యిది అమృతమువంటిది. వెల రూ. 2-8-0

### ప్రాణనాధ ఫార్మసీ

ఏజంట్లు— నలినీకాంత్ అండ్ బ్రదర్సు

3199. పాతజైల్ రోడ్డు, సికింద్రాబాదు

---

## ఆయుర్వేద ఔషధములు.

నమ్మకమైనవి, గుణవంతములైనవి దొరకును. 22 సం॥ అనుభవముగల వంటి ఖజ్జలి ఔషధములు, భస్మములు,ఆసవారిష్టములు ,లేహ్యములు, తైలములు, చూర్ణములు వగయిరా పరసమైన ధరలకు లభించును. అనేకులు ప్రశంసించి యున్నారు.

అన్నిచోట్ల ఏజంట్లు కావలయును.

ప్రధాన కార్యాలయము:—

చరకాశ్రమము 98,అగ్రహారం,గుంటూరు[యం, యస్.యం.శాస్త్రి]

వరంగల్ జిలా ఏజంట్లు:—

సుభాను మెడికల్ స్టోర్సు, రామన్న పేట, వరంగల్

---

# నేటి ఉత్తమ నాటికలు

వెల 1-0-0

నాటికల ఎంథాలజీ. తెనుగులో ఇదే మొదటిది. అన్నిబుక్షాపులలో దొరకును.

సంపాదకులు:- శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, ఎం. ఏ. గారు

తెనుగులో నేటివరకూ వచ్చిన తొమ్మండుగురు రచయితల ఉత్తమనాటికల సంపుటము.

వలయువారు పబ్లిషర్సు సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి అని వ్రాయునేది.

---

## హానిగలించు ఔషధాలనుండి జాగ్రత్త!

నిరపాయకరమై ప్రకృతిసిద్ధమైన "సెక్సోనా" ఉపయోగించండి. దీనిని మైపూతగా ఉపయోగించినయెడల అన్నివయస్సులవారికి పుంస్త్వమును కలిగించి వివాహిత జీవితమునుసార్థకముచేయును. ముసలివారలనుయువకులుగా చేయును.

నెం. 1బుడ్డి రు 3-8-0 స్పెషల్ బుడ్డి రు 5-0-0 వలయువారు

### కథియవార్ స్టోర్సు

సుల్తాన్ బజార్ హైద్రాబాదు, & జేమ్సుస్ట్రీట్ శికింద్రాబాద్.
మరియు మెయిన్ రోడ్, గుల్బర్గా.

